శ్లో॥ కదా నిలింపనిర్ఝరీనికుంజకోటరే వసన్
విముక్తదుర్మతిస్సదా శిరస్థమంజలిం వహన్।
విలోలలోలలోచనో లలామభాలలగ్నకః
శివేతి మంత్రముచ్చరన్ కదా సుఖీ భవామ్యహమ్॥ 13

శ్లో॥ ఇమం హి నిత్యమేవముక్తముక్తమోత్తమం స్తవం
పఠన్ స్మరన్ బ్రువన్నరో విశుద్ధిమేతి సంతతమ్।
హరే గురౌ సుభక్తిమాశు యాతి నాన్యథా గతిం
విమోహనం హి దేహినాం సుశంకరస్య చింతనమ్॥ 14

శ్లో॥ పూజావసానసమయే దశవక్త్రగీతం
యశ్శంభుపూజనపరం పఠతి ప్రదోషే।
తస్య స్థిరాం రథగజేంద్రతురంగయుక్తాం
లక్ష్మీం సదైవ సుముఖీం ప్రదదాతి శంభుః॥ 15

- శివార్పణమస్తు -



శ్రీః

(శ్రీ దశకంఠరావణ విరచితమ్)

# శివతాండవస్తోత్రమ్

వ్యాఖ్యాత : శంకరకింకరుడు



ప్రకాశకులు

శ్రీమతి రావి కృష్ణకుమారి

చీరాల - 523 155

శ్రీః

శ్రీదశకంఠరావణవిరచితమ్

# శివతాండవ స్తోత్రమ్



**RAVI MOHANA RAO**
Retd. Lecturer
# 404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
CHIRALA - 523 155.

ప్రతులు : 2000
పేజీలు : 16
వెల : అమూల్యం

DTP : **Ganesh Graphics,** Chirala.
Raja - **98483 90564**

Printed at :
**Neelkamal Printers,**
Chirala.



శ్లో॥ లలాటచత్వరజ్వలద్ధనంజయస్ఫులింగభా-
నిపీతపంచసాయకం నమన్నిలింపనాయకమ్।
సుధామయూఖలేఖయా విరాజమానశేఖరం
మహాకపాలి సంపదే శిరో జటాలమస్తు నః॥ **6**

శ్లో॥ కరాళభాలపట్టికాధగద్ధగద్ధగజ్జ్వల-
ద్ధనంజయాహుతీకృతప్రచండపంచసాయకే।
ధరాధరేంద్రనందినీకుచాగ్రచిత్రపత్రక-
ప్రకల్పనైకశిల్పిని త్రిలోచనే రతిర్మమ॥ **7**

శ్లో॥ నవీనమేఘమండలీనిరుద్ధదుర్ధరస్ఫురత్-
కుహూనిశీథినీతమఃప్రబంధబద్ధకంధరః।
నిలింపనిర్ఝరీధరస్తనోతు కృత్తిసింధురః
కలానిధానబంధురశ్శ్రియం జగద్ధురంధరః॥ **8**

శ్లో॥ ప్రఫుల్లనీలపంకజప్రపంచకాలిమప్రభా-
వలంబికంఠకందలీరుచిప్రబద్ధకంధరమ్।
స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం
గజచ్ఛిదంధకచ్ఛిదం తమంతకచ్ఛిదం భజే॥ **9**

శ్లో॥ అఖర్వసర్వమంగళాకలాకదంబమంజరీ-
రసప్రవాహమాధురీవిజృంభణామధువ్రతమ్।
స్మరాంతకం పురాంతకం భవాంతకం మఖాంతకం
గజాంతకాంధకాంతకం తమంతకాంతకం భజే॥ **10**

శ్లో॥ జయత్వదభ్రవిభ్రమభ్రమద్భుజంగమశ్వసద్-
వినిర్గమక్రమస్ఫురత్కరాలభాలహవ్యవాట్।
ధిమిద్ధిమిద్ధిమిద్ధ్వనన్ మృదంగతుంగమంగళ-
ధ్వనిక్రమప్రవర్తితప్రచండతాండవశ్శివః॥ **11**

శ్లో॥ దృషద్విచిత్రతల్పయోర్భుజంగమౌక్తికస్రజోః
గరిష్ఠరత్నలోష్ఠయోః సుహృద్విపక్షపక్షయోః।
తృణారవిందచక్షుషోః ప్రజామహీమహేంద్రయోః
సమప్రవృత్తికః కదా సదాశివం భజామ్యహమ్॥ **12**

# శ్రీః

# శివతాండవ స్తోత్రమ్

(శ్రీ దశకంఠరావణ విరచితమ్)

శ్లో॥ జటాటవీగలజ్జలప్రవాహపావితస్థలే
గలేవలంబ్య లంబితాం భుజంగతుంగమాలికామ్।
డమడ్డమడ్డమడ్డమన్నినాదవడ్డమర్వయం
చకార చండతాండవం తనోతు నశ్శివశ్శివమ్॥ 1

శ్లో॥ జటాకటాహసంభ్రమభ్రమన్నిలింపనిర్ఝరీ-
విలోలవీచివల్లరీవిరాజమానమూర్ధని।
ధగద్ధగద్ధగజ్జ్వలల్లలాటపట్టపావకే
కిశోరచంద్రశేఖరే రతిః ప్రతిక్షణం మమ॥ 2

శ్లో॥ ధరాధరేంద్రనందినీవిలాసబంధుబంధుర-
స్ఫురద్దిగంతసంతతిప్రమోదమానమానసే।
కృపాకటాక్షధోరణీనిరుద్ధదుర్ధరాపది
క్వచిద్దిగంబరే మనో వినోదమేతు వస్తుని॥ 3

శ్లో॥ జటాభుజంగపింగళస్ఫురత్ఫణామణిప్రభా-
కదంబకుంకుమద్రవప్రలిప్తదిగ్వధూముఖే।
మదాంధసింధురస్ఫురత్త్వగుత్తరీయమేదురే
మనో వినోదమద్భుతం బిభర్తు భూతభర్తరి॥ 4

శ్లో॥ సహస్రలోచనప్రభృత్యశేషలేఖశేఖర-
ప్రసూనధూళిధోరణీవిధూసరాంఘ్రిపీఠభూః।
భుజంగరాజమాలయా నిబద్ధజాటజూటకః
శ్రియై చిరాయ జాయతాం చకోరబంధుశేఖరః॥ 5





ఈ గ్రంథము
డా॥ నడిపినేని సూర్యనారాయణ
శ్రీమతి కోటేశ్వరమ్మ గార్ల
ఆర్థిక సహాయముతో ముద్రించబడినది.

**శ్లో॥ ఉమాప్రణామసంక్రాంతచరణాలక్తకః శశీ।**
**రాజహంసశ్రియం ధత్తే యస్య పాయాత్ స వ శ్శివః॥**
**- క్షేమేంద్రుడు**

***(ప్రణయకుపితమగు పార్వతిని ప్రసన్నను గావించుకొనుటకై శివుడామె పాదములకు తలవంచి మోకరిల్లినపుడు ఆమె పాదముల పారాణి ఆ స్వామి జడలలోని చంద్రవంకకు అంటుకొని శివుని జడలలో గంగయేకాదు, అందు ఎఱ్ఱని ముక్కుతో విహరించుచున్న రాజహంసకూడ ఉన్నదనిపించెనో, అట్టి చంద్రశేఖరుడైన స్వామి మిమ్ము కాచుగాక!)***



**తాత్పర్యము:-** నిత్యము ఈ స్తోత్రమును చదివినను, అర్థమును స్మరించినను, వివరించి పలికినను, మానవుడు శుద్ధుడగును. వాడు మహాశివభక్తుడగును. శివభక్తి సంపాదనకు వేరు దారిలేదు, శరీరధారుల అజ్ఞానము సదాశివధ్యానముచే మాత్రమే నశించును.

**శ్లో॥ పూజావసానసమయే దశవక్త్రగీతం**
**యశ్శంభుపూజనపరం పఠతి ప్రదోషే।**
**తస్య స్థిరాం రథగజేంద్రతురంగయుక్తాం**
**లక్ష్మీం సదైవ సుముఖీం ప్రదదాతి శంభుః॥ 15**

**అర్థము:-** ప్రదోషే=ప్రదోషకాలమున, పూజావసానసమయే=శివపూజా పరిసమాప్తి యందు,దశవక్త్రగీతమ్=దశకంఠుడైన రావణునిచే గానముచేయబడిన ఈ గీతమును, శంభుపూజనపరమ్=శివార్చనాపరమైన దానిని, యః ఎవడు, పఠతి=చదువునో, తస్య=వానికి, రథ=రథములతో, గజేంద్ర=మదగజములతో, తురంగ=గుఱ్ఱములతో, యుక్తామ్=కూడిన, సదా+ఏవ–సుముఖీమ్=ఎల్లపుడు ప్రసన్నముఖియైయుండు, స్థిరాం లక్ష్మీమ్=సుస్థిర సంపదను, శంభుః=శివుడు, ప్రదదాతి=ప్రసాదించును.

**తాత్పర్యము:-** ప్రదోషకాలమున శివపూజా పరిసమాప్తియందు ఎవడీ శివార్చనాపర మైన రావణకృతమైన స్తుతిని పఠించునో వానికి శివానుగ్రహముచే రథగజ తురంగములతో సదా సుప్రసన్నయైన స్థిరసంపదలు సిద్ధించును.

**- శివార్పణమస్తు -**



శ్లో॥ కదా నిలింపనిర్ఝరీనికుంజకోటరే వసన్
విముక్తదుర్మతిస్సదా శిరస్థమంజలిం వహన్।
విలోలలోలలోచనో లలామభాలలగ్నకః
శివేతి మంత్రముచ్చరన్ కదా సుఖీ భవామ్యహమ్॥ 13

**అర్థము:–** నిలింపనిర్ఝరీ=ఆకాశగంగాతీరమందలి, నికుంజకోటరే=పొదరింటి నడుమ, వసన్=నివసించుచున్నవాడనై, విముక్తదుర్మతిః=విడువబడిన దుర్బుద్ధిగల వాడనై, సదా=ఎల్లప్పుడు, అంజలిం–శిరఃస్థం–వహన్=కైమోడ్పును శిరమున వహించుచు, విలోల=చాంచల్యమును వీడిన, లోల=చంచలములైన, లోచనః= కన్నులుగలవాడనై, లలామభాలలగ్నకః=ఎన్నదగిన ఫాలభాగమునందేకాగ్రత నిల్పిన వాడనై, శివ+ఇతి మంత్రం+ఉచ్చరన్='శివ' యను మంత్రమును బలుకుచు, కదా–ఎపుడు, అహమ్=నేను, సుఖీ భవామి=సుఖింతునో కదా!

**తాత్పర్యము:–** గంగాతటమున – పొదరింటినడుమ చిత్తమున గల దుర్వృత్తులనెల్ల వీడి చంచల నేత్రములను స్థిరమొనర్చి, భ్రూమధ్యమున మనసు నిలిపి, శివనామ మహామంత్రము నుచ్చరించుచు సుఖించుట నాకు ఎన్నడు సంభవించునో కదా!

శ్లో॥ ఇమం హి నిత్యమేవముక్త 'ముక్తమోత్తమం' స్తవం
పఠన్ స్మరన్ బ్రువన్నరో విశుద్ధిమేతి సంతతమ్।
హరే గురౌ సుభక్తిమాశు యాతి నాన్యథా గతిం
విమోహనం హి దేహినాం సుశంకరస్య చింతనమ్॥ 14

**అర్థము:–** ఏవమ్=ఇట్లు, ఉక్త=చెప్పబడిన, ముక్తమ=మోక్షదాయకములలో, ఉత్తమమ్=గొప్పదైన, ఇమం స్తవమ్=ఈ స్తోత్రమును, నిత్యమ్=నిత్యము, పఠన్= చదువుచు, స్మరన్=తలంచుచు, బ్రువన్=పల్కుచు (వ్యాఖ్యానించుచు) నరః= మానవుడు, విశుద్ధిమ్=పరమపవిత్రతను, ఏతి=పొందును, గురౌ=గురువైన, హరే=శంకరునియందు, సుభక్తిమ్=చక్కని భక్తిని, ఆశు=తొందరగా, యాతి= పొందును, అన్యథా=వేరొక విధమున, గతిమ్=శివభక్తిని గూర్చిన గమనమును, న యాతి= పొందదు, దేహినామ్=దేహధారులకు, సుశంకరస్య చింతనమ్ హి=చక్కని శంకర చింతనము మాత్రమే, విమోహనమ్=అజ్ఞానమును నశింప జేయును (విగతమోహుల నొనర్చును).



# శ్రీః

# శివతాండవ స్తోత్రమ్

శ్లో॥ జటాటవీగలజ్జలప్రవాహపావితస్థలే
గలేవలంబ్య లంబితాం భుజంగతుంగమాలికామ్।
డమడ్డమడ్డమడ్డమన్నినాదవడ్డమర్వయం
చకార చండతాండవం తనోతు నశ్శివశ్శివమ్॥ 1

**అర్థము:–** జటాటవీ=జడలనెడు అడవినుండి, గలత్=జారుచున్న, జలప్రవాహ= జలప్రవాహముచే, పావిత=పవిత్రముగావింపబడిన, స్థలే=ప్రదేశమున, లంబితామ్= వ్రేలాడుచున్న, భుజంగతుంగమాలికామ్=సమున్నత సర్పహారమును, గలే+ అవలంబ్య=కంఠమున ధరించి, డమడ్డమడ్డమడ్డమత్=డమడమడమయను, నినాదవత్=ధ్వనిగల, డమరు=డమరుకముగల, చండతాండవమ్=ప్రచండమైన తాండవ నృత్యమును, శివః చకార=శివుడు ఆచరించెను, అయమ్=ఈ మహాదేవుడు, నః=మాకు, శివమ్=శుభమును, తనోతు=విస్తరింపజేయుగాక!

**తాత్పర్యము:–** అడవివలె పెరిగిన జడలనడుమనుండి జారుచున్న గంగచే పావన మగుచున్న ప్రదేశములో – మెడలోని సర్పహారము వ్రేలాడుచుండగా – చేతిలోని డమరుకము డమ డమ డమయని నినదించుచుండగా శివుడు ప్రచండతాండవము ను సాగించెను. ఆ తాండవనర్తకుడు – శివుడు – మాకు సకల శుభములను బ్రసాదించుగాక!

శ్లో॥ జటాకటాహసంభ్రమభ్రమన్నిలింపనిర్ఝరీ–
విలోలవీచివల్లరీవిరాజమానమూర్ధని।
ధగద్ధగద్ధగజ్జ్వలల్లలాటపట్టపావకే
కిశోరచంద్రశేఖరే రతిః ప్రతిక్షణం మమ॥ 2

**అర్థము:–** జటాకటాహ=జడలు అను పెనుగడవలో(నూనె కాచుటకు ఉపయోగించు వెడల్పు మూతిగల చాల పెద్దపాత్రను కటాహము అందురు) సంభ్రమ భ్రమత్=

వేగముగా తిరుగుచున్న, నిలింపనిర్ఝరీ=ఆకాశగంగయొక్క, విలోల=అధికము చలించు, వీచివల్లరీ=తరంగములనెడు తీవలతో, విరాజమాన=ప్రకాశించు, మూర్ధని =శిరముగల వానియందు, ధగద్ధగద్ధగజ్జ్వలత్=ధగధగమెఱయుచున్న, లలాటపట్ట =ఫాలభాగమందలి, పావకే=అగ్నిగలవానియందు, కిశోరచంద్రశేఖరే=బాలచంద్రుని తలదాల్చిన సామియందు, మమ=నాకు, ప్రతిక్షణమ్=ప్రతినిమేషము, రతిః=ప్రీతి చెలగుగాక!

**తాత్పర్యము:-** శివుని జడలే కటాహము, ఆ కటాహమున సురగంగ వేగముగా సుడులు తిరుగుచున్నది. (శివుని తాండవముచే) అపుడందు ఉదయించుచున్న తరంగలతికలతో ఆయన శిరము విరాజిల్లుచున్నది. అట్టి మహాదేవునియందు- ఫాలభాగమున ధగ ధగ మెఱయుచున్న అగ్నిని, శిరమున బాలచంద్రుని ధరించి యున్న మహాదేవునియందు నా ప్రీతి నిరంతరమై ప్రకాశించుగాక!

**శ్లో॥ ధరాధరేంద్రనందినీవిలాసబంధుబంధుర-**
**స్ఫురద్దిగంతసంతతిప్రమోదమానమానసే।**
**కృపాకటాక్షధోరణీనిరుద్ధదుర్ధరాపది**
**క్వచిద్దిగంబరే మనో వినోదమేతు వస్తుని॥ 3**

**అర్థము:-** ధరాధరేంద్రనందినీ=పర్వతరాజ పుత్రియొక్క, విలాసబంధు=విలాసములకు బంధువైన (విలాసములను పెంచు) శిరోభూషణముచే, బంధుర=అధికముగా, స్ఫురత్=ప్రకాశించుచున్న, దిగంతసంతతి=దిక్కుల చివరల సముదాయముచే, ప్రమోదమాన=ఆనందించు, మానసే=మానసముగల వానియందు, కృపాకటాక్ష ధోరణీ=దయతోనిండిన కడగంటి చూపుల ప్రవాహముచే, నిరుద్ధ=నిరోధింపబడిన, దుర్ధరాపది=మహావిపత్తులుగల, క్వచిత్=ఒకానొక, దిగంబరే వస్తుని=దెసలే వసనముగాగల వస్తువునందు, మనః=నా మనస్సు, వినోదం ఏతు=ఆనందమును అనుభవించుగాక!

**తాత్పర్యము:-** గిరిరాజకుమారి యొక్క అందమునకు సహకారియైన శిరోభూషణము తనకాంతులచే సర్వదిగంతములను మెఱయించుచుండగా ఆనందముతో ఉప్పొంగు చున్న స్వామియందు తన కరుణాకటాక్షములచే ఎంతటి విపత్తునైన వెనుకకు నెట్టివేయు ప్రభునియందు - అనిర్వచనీయదిగంబర తేజమందు - నా మానసము వినోదించుగాక!



**అర్థము:-** అదభ్ర=అత్యధికమైన, విభ్రమ భ్రమత్=వేగముగా పరిభ్రమించుచు, భుజంగమ శ్వసత్=బుసకొట్టుపాములచే, వినిర్గమ=వెలికివచ్చుచు, క్రమ=క్రమముగా, స్ఫురత్=మెఱయసాగిన, కరాల=భయంకరమైన, భాలహవ్యవాట్=ఫాలాగ్నిగల దేవుడు, ధిమిద్ధిమిద్ధిమిద్ధ్వనత్=ధిమిధిమిధిమి యని మ్రోగు, మృదంగ=మద్దెలయొక్క, తుంగ=ఉన్నతమైన, మంగళధ్వనిక్రమ=మంగళమయములైన ధ్వనుల ననుసరించి, ప్రవర్తిత=సాగింపబడిన, ప్రచండతాండవః=ప్రచండమైన తాండవము గల, శివః=శివుడు, జయతు=జయించుగాక!

**తాత్పర్యము:-** పరిభ్రమణ వేగమున పాములు బుసకొట్టగా, వెలికి ఉబికి మెఱయు చున్న ఫాలనేత్రాగ్నిగల రుద్రునకు, ధిమి-ధిమి-ధిమి యను మద్దెలయొక్క సమున్నత మంగళ ధ్వనులకు అనుకూలముగా అడుగులువేయుచు ప్రచండముగా తాండవించు నటరాజునకు - శివునకు జయమగుగాక!

**శ్లో॥ దృషద్విచిత్రతల్పయోర్భుజంగమౌక్తికస్రజోః**
**గరిష్ఠరత్నలోష్ఠయోః సుహృద్విపక్షపక్షయోః।**
**తృణారవిందచక్షుషోః ప్రజామహీమహేంద్రయోః**
**సమప్రవృత్తికః కదా సదాశివం భజామ్యహమ్॥ 12**

**అర్థము:-** దృషత్+విచిత్రతల్పయోః=శిలాతలమున, విచిత్రతల్పదేశమున, భుజంగమౌక్తికస్రజోః=సర్పమున, ముత్యాలసరమున, గరిష్ఠరత్నలోష్ఠయోః=మహారత్నమున, మట్టిబెడ్డయెడ, సుహృద్విపక్షపక్షయోః=మిత్రపక్షమున, శత్రుపక్షమున, తృణారవిందచక్షుషోః=తృణమున, కమలనేత్రయైన కాంతాలలామమున, ప్రజామహీమహేంద్రయోః=సామాన్య ప్రజలయెడ, భూలోక దేవేంద్రుడైన మహారాజువిషయమున, సమప్రవృత్తికః=సమానమైన ప్రవృత్తి కలవాడనై, అహమ్=నేను, కదా=ఎపుడు, సదాశివమ్=సదాశివుని, భజామి=సేవింతునో కదా!

**తాత్పర్యము:-** కటికనేలను, హంసతూలికా తల్పమును - సర్పమును, చక్కని ముత్యాల దండను - మహారత్నమును, మట్టిబెడ్డను - గడ్డిపరకను, కలువకంటిని - సామాన్యప్రజను, సకల భూమండలాధీశుడైన మహారాజును-మిత్రపక్షమును, శత్రుపక్షమును - అన్నిటిని సమప్రవృత్తితో తిలకించుచు సదాశివుని నేనెపుడు సేవింతునో కదా!

భవచ్ఛిదమ్=సంసారము నెడబాపువానిని, మఖచ్ఛిదమ్=దక్షయజ్ఞవిచ్ఛేదకుడైన ప్రభువును, గజచ్ఛిత్+అంధకచ్ఛిదమ్=గజాసురుని, అంధకారసురుని గడతేర్చిన, తమ్=ఆ, అంతకచ్ఛిదమ్=కాలకాలుని, భజే=సేవింతుము.

**తాత్పర్యము:–** వికసించిన నల్లకలువపూలప్రోవు ఎంత నల్లని కాంతిని విరజిమ్మునో – అంత నల్లదనముతో ప్రకాశించు కంఠదేశముగల – కామారి – పురారి – దక్షయజ్ఞ విధ్వంసకుడైన సంసారహారి – గజదనుజారి – అంధకాసురుని జీల్చి చెండిన శూలపాణి – ఆ కాలకాలుడు నా సేవలను గైకొనుగాక!

**శ్లో॥ అఖర్వసర్వమంగళాకలాకదంబమంజరీ–**
**రసప్రవాహమాధురీవిజృంభణామధువ్రతమ్।**
**స్మరాంతకం పురాంతకం భవాంతకం మఖాంతకం**
**గజాంతకాంధకాంతకం తమంతకాంతకం భజే॥ 10**

**అర్థము:–** అఖర్వ=గొప్పదైన, సర్వమంగళా=పార్వతియొక్క, కళాకదంబ=విలాస వితతి యనెడు, మంజరీ=గుత్తిలోని, రసప్రవాహా=రసస్రవంతి యొక్క, మాధురీ= తీయదనమున, విజృంభణా=విజృంభించుట యందు, మధువ్రతమ్=తుమ్మెదయైన, స్మరాంతకమ్=మదనాంతకుని, పురాంతకమ్=త్రిపురాంతకుని, భవాంతకమ్=జనన మరణములనురూపుమాపువేల్పును,మఖాంతకమ్=దక్షునిక్రతువును ధ్వంసమొనర్చిన వానిని, గజాంతకాంధకాంతకమ్=గజాసురుని, అంధకదైత్యుని గీటడగించిన దేవ దేవుని, తమ్=ఆ, అంతకాంతకమ్=యమునిపాలిటి యముడైన శంకరుని, భజే= సేవింతును.

**తాత్పర్యము:–** సర్వమంగళా కలావిలాసముల మాధురీరసప్రవాహమున గండు తుమ్మెదవలె ఆసక్తుడై చెలగు ప్రభువు–కామారి–పురారి–భవహారి–దక్ష యజ్ఞమును ధ్వంస మొనర్చిన ఆ గజారి–అంధకారి– ఆ యమాంతకుడు–నటరాజు– మా సేవల నంగీకరించుగాక!

**శ్లో॥ జయత్వదభ్రవిభ్రమభ్రమద్భుజంగమశ్వసద్–**
**వినిర్గమక్రమస్ఫురత్కరాలభాలహవ్యవాట్।**
**ధిమిద్ధిమిద్ధిమిద్ధ్వనన్ మృదంగతుంగమంగళ–**
**ధ్వనిక్రమప్రవర్తితప్రచండతాండవశ్శివః॥ 11**



**శ్లో॥ జటాభుజంగపింగళస్ఫురత్ఫణామణిప్రభా–**
**కదంబకుంకుమద్రవప్రలిప్తదిగ్వధూముఖే।**
**మదాంధసింధురస్ఫురత్త్వగుత్తరీయమేదురే**
**మనో వినోదమద్భుతం బిభర్తు భూతభర్తరి॥ 4**

**అర్థము:–** జటా=జడలలోని, భుజంగ=పాములయొక్క, పింగళ=పచ్చగా, స్ఫురత్ =మెఱయుచున్న, ఫణా=పడగలయందలి, మణి=మణులయొక్క, ప్రభాకదంబ =కాంతిపుంజమనెడు, కుంకుమద్రవ=కుంకుమరంగు ద్రవముచే, ప్రలిప్త=దట్టముగా పూయబడిన, దిగ్వధూముఖే–దిగంగనాముఖములుగల వానియందు, మదాంధ= మదముచే కన్నుగానరాని, సింధుర=ఏనుగు యొక్క, స్ఫురత్=మెఱయుచున్న, త్వగుత్తరీయ=చర్మమనెడు పై బట్టతో, మేదురే=ఒప్పుచున్న, భూతభర్తరి=భూత నాథుడైన శివునియందు, మనః=నా మానసము, అద్భుతం వినోదమ్=గొప్ప వినోదమును, బిభర్తు=అనుభవించుగాక!

**తాత్పర్యము:–** జడలలో సర్పరాజులతో, భుజమున గజచర్మముతో స్వామి తాండవము సాగించుచున్నాడు. ఆ పాముల పడగలమీద పచ్చగా మెఱయుచున్న మణులే దిక్కాంతా కపోలములపై ఎఱ్ఱని కుంకుమకాంతులను విరజిమ్ముచున్నవి. మదగజ చర్మము సొగసైన ఉత్తరీయముగా స్వామి భుజముపై కదలాడుచున్నది. ఇట్లున్న నటరాజైన ఆ భూతనాథునియందు నా మానసము మహానందతుందిలమై వర్తిల్లుగాక!

**శ్లో॥ సహస్రలోచనప్రభృత్యశేషలేఖశేఖర–**
**ప్రసూనధూళిధోరణీవిధూసరాంఘ్రిపీఠభూః।**
**భుజంగరాజమాలయా నిబద్ధజాటజూటకః**
**శ్రియై చిరాయ జాయతాం చకోరబంధుశేఖరః॥ 5**

**అర్థము:–** సహస్రలోచనప్రభృతి=ఇంద్రాదులైన, అశేష=సమస్తమైన, లేఖ=దేవతల యొక్క, శేఖర=శిరోమాలికలలోని, ప్రసూనధూళి=పుప్పొడి యొక్క, ధోరణీ= ప్రవాహముచే, విధూసర=విశేషము ధూసరితమైన, అంఘ్రిపీఠభూః=పాదపీఠ ప్రదేశము గలవాడు, భుజంగరాజమాలయా=నాగేంద్రహారముచే, నిబద్ధ=కట్టబడిన, జాటజూటకః=జటాజూటకము గలవాడు, శ్రియై చిరాయ జాయతామ్=మా చిరంతనములైన సిరులకై ఆవిర్భవించుగాక!

**తాత్పర్యము:-** చకోరములకు విందులుసేయు జాబిలిరేకను తలదాల్చిన సామి ఇంద్రాదిదేవతల సిగదండల పుప్పొడిచే ధూళిధూసరమైన పాదపీఠముగల ప్రభువు పాప పేరులతో జడలను బిగియగట్టిన జగదీశుడు-మాకు తరుగని సిరులను కరుణించుగాక!

**శ్లో॥ లలాటచత్వరజ్వలద్ధనంజయస్ఫులింగభా-**
**నిపీతపంచసాయకం నమన్నిలింపనాయకమ్।**
**సుధామయూఖలేఖయా విరాజమానశేఖరం**
**మహాకపాలి సంపదే శిరో జటాలమస్తు నః॥ 6**

**అర్థము:-** లలాటచత్వర=ఫాలభాగమనెడు వేదికయందు, జ్వలత్=మండుచున్న, ధనంజయ+స్ఫులింగ=అగ్నికణముల, భా=కాంతిచే, నిపీత=త్రాగివేయబడిన, పంచ సాయకమ్=మన్మథుడుగల, నమత్=మ్రొక్కుచున్న, నిలింపనాయకమ్=ఇంద్రుడుగల, సుధామయూఖలేఖయా=చంద్రరేఖతో,విరాజమాన=ఒప్పుచున్న,శేఖరమ్=కిరీటముగ, శిరోజటాలమ్=జడలతోనిండిన శిరముగల, మహాకపాలి=పెద్ద కపాలమును దాల్చిన తేజము, నః=మా యొక్క, సంపదే=సంపదకై, అస్తు=అగుగాక!

**తాత్పర్యము:-** లలాటవేదికయందు ప్రజ్వలించు అగ్నివిస్ఫులింగముల సెగచే మదనుని హరించినది - ఇంద్రునిచే మ్రొక్కబడునది, శశిరేఖచే సుశోభితమైన కిరీటముగలది, జటామండితమస్తకమైనది, పెద్దకపాలమును చేతబూనినది అయిన దివ్యతేజమొకటి మాకు సంపత్ప్రదమై ఉదయించుగాక!

**శ్లో॥ కరాళభాలపట్టికాధగద్ధగద్ధగజ్జ్వల-**
**ద్ధనంజయాహుతీకృతప్రచండపంచసాయకే।**
**ధరాధరేంద్రనందినీకుచాగ్రచిత్రపత్రక-**
**ప్రకల్పనైకశిల్పిని త్రిలోచనే రతిర్మమ॥ 7**

**అర్థము:-** కరాళ=భయంకరమైన, భాలపట్టికా=ఫాలదేశమున, ధగద్ధగద్ధగత్+ జ్వలత్=ధగ ధగ మెరయుచున్న, ధనంజయ=అగ్నియందు, ఆహుతీకృత=ఆహుతిగా చేయబడిన, ప్రచండ=దుర్దాంతుడైన, పంచసాయకే=మన్మథుడుగల వానియందు, ధరాధరేంద్రనందినీ=పర్వతరాజకుమారియొక్క, కుచాగ్ర=చనుమొనలపై, చిత్ర= చిత్రములైన, పత్రక=సన్నని మకరికా పత్రములను, ప్రకల్పనా+ఏకశిల్పిని=రచించు చతుర శిల్పియందు, త్రిలోచనే=మూడుకన్నుల సామియందు, మమ=నాకు, రతిః =ప్రీతి ఉదయించుగాక!



**తాత్పర్యము:-** విశాల ఫాలభాగమున ధగ ధగ మెఱయు మహాగ్నియందు ప్రచండు డైన మన్మథుని ఆహుతియొనర్చి కొండలరాయని కూతురుయొక్క కుచాగ్రములపై, మకరికాపత్రరచనా శిల్పనైపుణ్యమును ప్రదర్శించు మూడు కన్నుల వేలుపుసామి పై నామానసము లగ్నమై వర్తిల్లుగాక!

**శ్లో॥ నవీనమేఘమండలీనిరుద్ధదుర్ధరస్ఫురత్-**
**కుహూనిశీథినీతమఃప్రబంధబద్ధకంధరః।**
**నిలింపనిర్ఝరీధరస్తనోతు కృత్తిసింధురః**
**కలానిధానబంధురశ్శ్రియం జగద్ధురంధరః॥ 8**

**అర్థము:-** నవీన=క్రొత్తదైన, మేఘమండలీ=మేఘబృందముచే, నిరుద్ధ=ఆవృతమై, దుర్ధర=ధరింపరానిదై, స్ఫురత్=ఒప్పుచున్న, కుహూనిశీథినీ=అమవసరాతిరి యొక్క తమః ప్రబంధ=చీకటులు కూర్పుచే, బద్ధ=బిగియగట్టబడిన, కంధరః=కంఠముగల దేవర, నిలింప=దేవతల, నిర్ఝరీ=నదిని, ధరః=ధరించిన ప్రభువు, కృత్తిసింధురః= ఏనుగుతోలునుగట్టిన దేవదేవుడు, కలానిధాన=షోడశకళాపరిపూర్ణుడైన చంద్రునిచే, బంధురః=ఒప్పుచున్న, జగత్ ధురంధరః=జగద్భారమును వహించు సామి, శ్రియమ్ =సిరిని, తనోతు=విస్తరింపచేయుగాక!

**తాత్పర్యము:-** క్రొక్కారు మబ్బులు చెలరేగి చుట్టుముట్టిన - అమావాస్య నాటి అర్ధరాత్రమందలి చిమ్మచీకటులను ముద్దగా జేసి యిచట బంధించినారా, అన్నటు లున్న కంఠదేశముగల వేలుపుదేవర ఏనుగుతోలును బట్టగా జుట్టుకొన్న చంద్రమౌళి -జగద్భారమునెల్లవహించు స్వామి మాకు సిరులను విరివిగా కరుణించుగాక!

**శ్లో॥ ప్రఫుల్లనీలపంకజప్రపంచకాలిమప్రభా-**
**వలంబికంఠకందలీరుచిప్రబద్ధకంధరమ్।**
**స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం**
**గజచ్ఛిదంధకచ్ఛిదం తమంతకచ్ఛిదం భజే॥ 9**

**అర్థము:-** ప్రఫుల్ల=వికసించిన, నీలపంకజ=నల్లకలువల, ప్రపంచ=సముదాయము యొక్క, కాలిమప్రభా=నల్లనికాంతిని, అవలంబి=ధరించియున్న, కంఠకందలీ= కంఠకుహరములోని, రుచి=కాంతిచే, ప్రబద్ధ=అధికము ఒప్పుచున్న, కంధరమ్= కంఠముగల వానిని, స్మరచ్ఛిదమ్=మదనాంతకుని, పురచ్ఛిదమ్=త్రిపురహరుని,

త్వరలో...

## శ్రీ మహిషాసుర మర్ధనీస్తోత్రమ్

ప్రతిపదార్ధ - తాత్పర్యములతో...

శ్రీః

(శ్రీ దశకంఠరావణ విరచితమ్)

వ్యాఖ్యాత : శంకరకింకరుడు



ప్రకాశకులు

చీరాల - 523 155

# శివతాండవ స్తోత్రమ్

(శ్రీ దశకంఠరావణ విరచితమ్)

శ్లో॥ జటాటవీ గలజ్జల ప్రవాహ పావితస్థలే
గలేవ లంబ్య లంబితాం భుజంగ తుంగ మాలికామ్।
డమడ్డమడ్డమడ్డమన్నినాదవడ్డమర్వయం
చకార చండతాండవం తనోతు నశ్శివశ్శివమ్॥ 1

శ్లో॥ జటాకటాహసంభ్రమభ్రమన్నిలింపనిర్ఝరీ-
విలోలవీచివల్లరీవిరాజమానమూర్ధని।
ధగద్ధగద్ధగజ్జ్వలల్లలాటపట్టపావకే
కిశోరచంద్రశేఖరే రతిః ప్రతిక్షణం మమ॥ 2

శ్లో॥ ధరాధరేంద్రనందినీవిలాసబంధుబంధుర-
స్ఫురద్దిగంతసంతతిప్రమోదమానమానసే।
కృపాకటాక్షధోరణీనిరుద్ధదుర్ధరాపది
క్వచిద్దిగంబరే మనో వినోదమేతు వస్తుని॥ 3

శ్లో॥ జటాభుజంగపింగళస్ఫురత్ఫణామణిప్రభా-
కదంబకుంకుమద్రవప్రలిప్తదిగ్వధూముఖే।
మదాంధసింధురస్ఫురత్త్వగుత్తరీయమేదురే
మనో వినోదమద్భుతం బిభర్తు భూతభర్తరి॥ 4

శ్లో॥ సహస్రలోచనప్రభృత్యశేషలేఖశేఖర-
ప్రసూనధూళిధోరణీవిధూసరాంఘ్రిపీఠభూః।
భుజంగరాజమాలయా నిబద్ధజాటజూటకః
శ్రియై చిరాయ జాయతాం చకోరబంధుశేఖరః॥ 5

శ్లో॥ లలాటచత్వరజ్వలద్ధనంజయస్ఫులింగభా-
నిపీతపంచసాయకం నమన్నిలింపనాయకమ్।
సుధామయూఖలేఖయా విరాజమానశేఖరం
మహాకపాలి సంపదే శిరో జటాలమస్తు నః॥ 6

శ్లో॥ కరాళభాలపట్టికాధగద్ధగద్ధగజ్జ్వల-
ద్ధనంజయాహుతీకృతప్రచండపంచసాయకే।
ధరాధరేంద్రనందినీకుచాగ్రచిత్రపత్రక-
ప్రకల్పనైకశిల్పిని త్రిలోచనే రతిర్మమ॥ 7

శ్లో॥ నవీనమేఘమండలీనిరుద్ధదుర్ధరస్ఫురత్-
కుహూనిశీథినీతమఃప్రబంధబద్ధకంధరః।
నిలింపనిర్ఝరీధరస్తనోతు కృత్తిసింధురః
కలానిధానబంధురశ్శ్రియం జగద్ధురంధరః॥ 8

శ్లో॥ ప్రఫుల్లనీలపంకజప్రపంచకాలిమప్రభా-
వలంబికంఠకందలీరుచిప్రబద్ధకంధరమ్।
స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం
గజచ్ఛిదంధకచ్ఛిదం తమంతకచ్ఛిదం భజే॥ 9

శ్లో॥ అఖర్వసర్వమంగళాకలాకదంబమంజరీ-
రసప్రవాహమాధురీవిజృంభణామధువ్రతమ్।
స్మరాంతకం పురాంతకం భవాంతకం మఖాంతకం
గజాంతకాంధకాంతకం తమంతకాంతకం భజే॥ 10

శ్లో॥ జయత్వదభ్రవిభ్రమభ్రమద్భుజంగమశ్వసద్-
వినిర్గమక్రమస్ఫురత్కరాలభాలహవ్యవాట్।
ధిమిద్ధిమిద్ధిమిధ్వనన్ మృదంగతుంగమంగళ-
ధ్వనిక్రమప్రవర్తితప్రచండతాండవశ్శివః॥ 11

శ్లో॥ దృషద్విచిత్రతల్పయోర్భుజంగమౌక్తికస్రజోః
గరిష్ఠరత్నలోష్ఠయోః సుహృద్విపక్షపక్షయోః।
తృణారవిందచక్షుషోః ప్రజామహీమహేంద్రయోః
సమప్రవృత్తికః కదా సదాశివం భజామ్యహమ్॥ 12

శ్లో॥ కదా నిలింపనిర్ఝరీనికుంజకోటరే వసన్
విముక్తదుర్మతిస్సదా శిరస్థమంజలిం వహన్।
విలోలలోలలోచనో లలామభాలలగ్నకః
శివేతి మంత్రముచ్చరన్ కదా సుఖీ భవామ్యహమ్॥ 13

శ్లో॥ ఇమం హి నిత్యమేవముక్తముక్తమోత్తమం స్తవం
పఠన్ స్మరన్ బ్రువన్నరో విశుద్ధిమేతి సంతతమ్।
హరే గురౌ సుభక్తిమాశు యాతి నాన్యథా గతిం
విమోహనం హి దేహినాం సుశంకరస్య చింతనమ్॥ 14

శ్లో॥ పూజావసానసమయే దశవక్త్రం గీతం
యశ్శంభుపూజనపరం పఠతి ప్రదోషే।
తస్య స్థిరాం రథగజేంద్రతురంగయుక్తాం
లక్ష్మీం సదైవ సుముఖీం ప్రదదాతి శంభుః॥ 15

– శివార్పణమస్తు –